నాలోచించి నేను జెప్పినట్లు సీత యన్ని విధంబులను క్షేమంబుగానున్న దని నమ్ముము.

ఇది యఱువదియేడవ సర్గము.

## అఱువదియెనిమిదవ సర్గము

పురుషశ్రేష్ఠుండవగు రామా! అంత సీతాదేవి నీవు నాయం దెచ్చుగా స్నేహం బుండుటవలనను నేను యథార్థముగా సాహాయ్యంబు చేయుదుననునమ్మకంబువలనను బ్రయాణంబునకై త్వరపడుచున్న నన్నుం జూచి యింకఁ జేయవలసినకార్యముంగూర్చి యిట్లని చెప్పెను. ౧

దశరథునిపుత్రుండగు రాముండు యుద్ధంబున రావణుం జంపి నన్ను శీఘ్రంబుగాఁ బొందునట్లు నీవు నానావిధంబులుగా నతనికిఁ జెప్పవలయును.

శత్రువుల నడంగఁద్రొక్కునట్టి పరాక్రమవంతుండవగు హనుమంతుఁడా! నీకిచ్చయుండునేని యిచ్చో నొకదిన ముండుము. ఎచ్చటనేని యొకరహస్య ప్రదేశంబున విశ్రమించి రేపు పోఁగలవు. ౩

పరాక్రమవంతుఁడవగు హనుమంతుఁడా! అట్లు నీవిచ్చట నొక దినం బుండువేని నీసహవాసమువలన మందభాగ్యురాల నగు నాకును గొంచెము సేపు దుఃఖశాంతియగును. ౪

పరాక్రమశాలివగు నీవు పునరాగమనంబునకై పోఁగానే నాప్రాణంబులు పోయినను బోవును. ఇందుకు సందియము లేదు. ౫

మొదలే రామవియోగదుఃఖంబునొంది పరితపించుచు దీనురాలనై యీరాక్షసులచే బాధింపఁబడుచున్న నే నింక నిన్నుం జూడకుండునేని మఱియుం దుఃఖంబు నొందుదును. ౬

పరాక్రమశాలివి వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీసహాయులగు ఋక్షవానరుల విషయమై నా కొక గొప్పసందేహం బున్నది. ౭

ఆఋక్షవానరులు దాఁటఁగూడని యీమహాసముద్రంబు నెట్లు దాఁటుదురు? రాజపుత్రులగు రామలక్ష్మణులయినను ఎట్లు దాఁటఁగలరు? ౮

త్రయాణామేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే,
శక్తిస్స్యాద్వైనతేయస్య తవ వా మారుతస్య వా. ౯
తదస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే,
కిం పశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాం వర. ౧౦

కామమస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్యస్తే ఫలోదయః. ౧౧
బలైస్సమగ్రైర్యది మాం హత్వా రావణమాహవే,
విజయీ స్వాం పురీం రామో నయేత్తత్స్యాద్యశస్కరమ్. ౧౨

యథాఽహం తస్య వీరస్య వనాదుపధినా హృతా,
రక్షసా తద్భయాదేవ తథా నార్హతి రాఘవః. ౧౩

బలైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః,
మాం నయేద్యది కాకుత్స్థస్తత్తస్య సదృశం భవేత్. ౧౪
తద్యథా తస్య విక్రాంతమనురూపం మహాత్మనః,
భవత్యాహవశూరస్య తథా త్వముపపాదయ. ౧౫

తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశమ్యాహం తతశ్శేషం వాక్యముత్తరమబ్రువమ్. ౧౬
దేవి హర్యృక్షసైన్యానామీశ్వరః ప్లవతాం వరః,
సుగ్రీవస్సత్త్వసంపన్నస్తవార్థే కృతనిశ్చయః. ౧౭
తస్య విక్రమసంపన్నాస్సత్త్వవంతో మహాబలాః,
మనస్సంకల్పసంపాతా నిదేశే హరయస్స్థితాః. ౧౮
ఏషాం నోపరి నాధస్తాన్న తిర్యక్సజ్జతే గతిః,
న చ కర్మసు సీదంతి మహత్స్వమితతేజసః. ౧౯

గరుత్మంతునకును, నీకును, వాయుపుత్రునకును మీ ముగ్వురకే యీ సముద్రము దాటుటకు శక్తియున్నది గాని మఱి యెవ్వరికిని లేదు. ౯

పరాక్రమశాలివి, కార్యంబుఁ దెలిసినవారిలో శ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అట్టి అసాధ్యంబగు కార్యంబును సాధించుటకు నీ వేయుపాయం బూహించియున్నావు? చెప్పుము. ౧౦

శత్రువీరులం జంపునట్టి హనుమంతుఁడా! నీకార్యసాధనశక్తి యద్భుతంబయినది. కావున నీకార్యంబు సాధించుటకు నీవొక్కఁడవె చాలుదువు.

రాముఁడు వానరసైన్యములతోఁ గూడ వచ్చి యుద్ధంబున రావణుం జంపి జయంబునొంది నన్నుఁ దనపట్టణంబునకుం గొనిపోవ్వు చేసిన యది నాకును అతనికిఁ గీర్తికరంబగును. ౧౨

రావణుఁడు పరాక్రమవంతుఁడగు రామునిభార్యనగు నన్ను వనంబున నుండి రామభయంబునఁ గపటంబుగా నపహరించుకొనివచ్చినట్లు రాముండు నన్ను రహస్యముగాఁ దీసికొనిపోవుట యెంతమాత్రము యుక్తముకాదు.

శత్రుసైన్యంబులం జంపునట్టి రాముఁడు లంకయంతయు సైన్యంబుల నిండించి నన్నుఁ గొనిపోవునేని యది యతనికి సదృశంబుగా నుండును.

అందువలన మహాపరాక్రమశాలియు యుద్ధప్రియుఁడు నగు నా రాముఁడు తనపరాక్రమంబున కనురూపంబుగాఁ బరాక్రమించునట్లు నీవాన గూర్పవలయును. ౧౫

అధికార్థము యుక్తియుక్తంబును వినయోపపన్నంబు నగు నా మాటను విని నేను ఇట్లని బదులు చెప్పితిని. ౧౬

సీతాదేవీ! ఋక్షవానరాధీశ్వరుండును వానరశ్రేష్ఠుండును బలవంతుండునగు సుగ్రీవుండు నీకార్యంబు సాధింప నిశ్చయించియున్నాడు. ౧౭

పరాక్రమవంతులును శక్తిమంతులును బలవంతులు మనస్సునకుంబోలె వేగముగలవారలునగు వానరులనేకులు ఆసుగ్రీవుని చేతిక్రిందనున్నారు. ౧౮

ఆవానరులు ఆకాశమార్గంబునఁ గాని పాతాళమార్గంబునఁ గాని తిర్యఙ్మార్గంబునంగాని యడ్డములేక సంచరింపఁగలరు. మఱియుం నెట్టిగొప్ప కార్యంబులైనను ఎంతమాత్రము శ్రమలేక చేయుంగలరు. ౧౯

